# ఇందులో



*అమితమైన ప్రేమ అమ్మ.. అంతులేని అనురాగం అమ్మ..*

*అలుపెరుగని ఓర్పు అమ్మ.. అద్భుతమైన స్నేహం అమ్మ..*

*అపురూపమైన కావ్యం అమ్మ..*

*అరుదైన రూపం అమ్మ......*

--: ooo :--

*ఎంతో మంది బంధువులు నాకు ఉన్నా అమ్మ నీ చూపులోని*
*మాతృప్రేమ అను అనుభూతి నాకు ఇంకెక్కడా దక్కలేదు.*

# అమ్మకు అభినందన హారం

అమ్మ మనకు రూపాన్నిచ్చిన అమృతమూర్తి. ఆ మాతృమూర్తి గొప్పదనాన్ని ఎన్నో విధాల కీర్తించారు.

**అపిస్వర్ణమయీ లంకాసమమ రోచతే**
**జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ**

లంక బంగారు మయమైనా నాకు మాత్రం రుచింపదు. జన్మనిచ్చిన తల్లి, జన్మించిన చోటు స్వర్గంలోనూ దొరకవు. లంకను చూసిన లక్ష్మణుడు చెప్పిన మాటలివి.

**సకల తీర్థమయీ మాతా సర్వదేవమయః**
**పితామాతరం పితరం తస్మాత్సార్య యత్నేన పూజయేత్**

సకల తీర్థాలు తల్లియే. తండ్రియే సకల దేవతా స్వరూపుడు. వీరిద్దరినీ సేవించడం సకల తీర్థక్షేత్ర సందర్శనమంత పుణ్యం. డా॥ సంధ్యావందనం లక్ష్మీదేవి గారు ఒకానొక చోట పొందు పరిచిన మాతృమూర్తికి శ్లోకాల అభినందన దండ అభినంద నీయమైనది. ఆమె భావాల్లోనే తల్లి గొప్పదనాన్ని నెమరువేసుకుందాం.



*అమ్మా నేను పెరిగే ప్రతీ క్షణం నీ బరువు బాధ్యతలు పెంచాను.*
*అయినా నన్ను భరిస్తున్నావు. పదినెలల పాటే కాదు నీ ప్రాణం ఉన్నంత దాక.*

**నాస్తి మాతృ సమో గురుః**

తల్లిని మించిన గురువు ఈ లోకంలో ఇంకొకరు లేరు. పరమాత్ముడు తనకు బదులుగా తల్లిని ప్రసాదించాడు. ఆమె విశేషమైన వరదేవత. లోకానికి ప్రత్యక్ష దేవత.

తల్లిని సంతోషపెట్టడమే సంతానం ప్రథమ ధర్మమని వేదం ఘోషిస్తుంది.

**మానయతి సా మాతా**

సంతానానికి మాన్యతను కల్పించేది తల్లి. బిడ్డల్ని జితేంద్రి యులుగా ఆమె తీర్చిదిద్దుతుంది. ధైర్యం, శౌర్యం, శాంతి, ప్రసన్నత మొదలైన శు భగుణాలు బిడ్డలకు అలవడేటట్లుగా తల్లి సర్వదా కృషి చేస్తుంది. సంతానాన్ని విద్యాబుద్ధులతో సంస్కరిస్తుంది. అందుకే ప్రాచీన మహాత్ములు.

**సహస్రంతు పితౄా మాతా గౌరవేణాతి రచ్యతే (మనుస్మృతి)**

వేయి మంది తండ్రులకంటే ఒక తల్లి గొప్పదని, ఆమె వందనీయురాలు, మాననీయురాలని మనుమహర్షి కీర్తించాడు.

బిడ్డలు తల్లి గర్భంలో ఉన్నప్పుడు, తల్లుల మనస్తత్వం వారి ఆలోచనా ప్రభావం, సంస్కారం పిల్లలపై ప్రబలంగా ఉంటుందని ప్రాచీన మహర్షులు అన్నారు. నేటి వైజ్ఞానికులు కూడా ఇదే అభిప్రయాన్ని వ్యక్తం చేస్తున్నారు.

**యం మాతా పితరౌ క్లేశం సహేతే సంభవేన్నృణామ్ ।**
**నతస్య నిష్కృతిః శక్యాకర్తుం వర్ష శతైరపి॥ (మనుస్మృతి)**

సంతానాన్ని నిర్మించడంలో తల్లిదండ్రులు పడే వేదనకు, కష్టానికి వారి సహనానికి మనం ఎన్ని వందల సంవత్సరాలు సేవ చేసినా వారి

*అమ్మా నీ కాలం చెల్లే సమయాన నేను నీకోసం ఉండబోనని తెలిసి నన్ను కనురెప్పలా కాపాడుతున్నావు. ఒక దేవతలా.*

రుణం తీర్చుకోలేం. మాతృమూర్తి దయార్ద్ర హృదయాన్ని దేనితోను పోల్చలేం. అందుకే ఉపనిషత్తులు తల్లికి దేవతాతుల్యమైన స్థానాన్నిచ్చి గౌరవించాయి. అట్లాంటి తల్లిని హింసించి, వేధించి, బాధించే సంతానం వ్యర్థం, నిష్ప్రయోజనమని శాస్త్రాలు అంటున్నాయి.



**మనోవధీః పితరం మోత మాతరమ్ (యజుర్వేదం)**

**తల్లిదండ్రులను వధింప కూడదని వేదం సందేశమిస్తుంది.**

తల్లిని శ్రద్ధతో పోషించడం దేవతలను సేవించడంతో సమానమని ఉపనిషత్కారులు అంటున్నారు. తల్లి శ్రద్ధామూర్తి. ఆమె చల్లని నీడలో శాంతి, సుఖాలు లభిస్తాయి.

సంతానాన్ని నిర్మించే శక్తిని పరమాత్ముడు తల్లికి ప్రసాదించాడు. తల్లి తన బిడ్డలకు సత్యమైన ఉపదేశమే ఇవ్వాలి. ధర్మకార్యాలు చేయమని ఆదేశించాలి. దుష్టకర్మలను విడవమని బోధించాలి. తల్లిదండ్రులతో సంతానం ఎప్పుడూ విరోధం పెట్టుకోకూడదని ఋషులంటున్నారు. కారణం తల్లిదండ్రులకు బిడ్డలపై కరుణ, ప్రేమ, దయ, వాత్సల్యం ఎప్పుడూ తరిగిపోకుండా ఉంటాయి.

*అమ్మా నీ జీవితంలోని మొదటి సగం నీ తల్లిదండ్రుల కోసం గడిపావు మిగిలిన కాలమంతా నీపిల్లల కోసమే తపించావు ఎప్పుడైనా నీకంటూ జీవించావా?*

**మాతృవత్ పరదారేషు**

పరస్త్రీలను తల్లివలె ఆదరించాలని నీతిశాస్త్ర కోవిదు లంటున్నారు. స్త్రీలు ఎదురుపడితే వారిని మాతృమూర్తులుగా భావించి వారికి శిరస్సు వంచి నమస్కరించాలని ప్రాచీన మహర్షులంటున్నారు.

మహాభారతంలో యక్షుడు ధర్మరాజును భూమికంటే గొప్పదేదని ప్రశ్నిస్తాడు. దానికి ధర్మరాజు...

**మాతా గురుతరా భూమే**

మాతృమూర్తి పృథివి కంటే గొప్పదని, ఉన్నతమైందని, విలువైందని సమాధానమిస్తాడు.

సంన్యాసి లోకపూజ్యుడు. అంటే సంన్యాసిని లోకమంతా పూజిస్తుంది. కాని ఆ సంన్యాసి తల్లిని పూజిస్తాడు. భగవంతుని తరువాత పూజింపయోగ్యురాలు తల్లి.

**పూజనం నామ సత్కారః**

పూజించడమంటే త్రికరణశుద్ధిగా వారిని సేవించి సత్కరించడమే. తల్లి విలువ తెలుసుకొని ఆమె మనసుకు బాధలేకుండా, ఎప్పుడూ సంతోషంగా ఉండేట్లుగా చూసుకోవడమే మన ధర్మం.

# అమ్మలోని కమ్మదనం

మానవాళి పెదాలపై కదలాడే అత్యంత మధురమైన పదం అమ్మ. ప్రేమలు చెదిరిపోవచ్చు. యవ్వనం కరిగి పోవచ్చు. స్నేహం ముక్కలైపోవచ్చు. కానీ జీవితాంతం మారకుండా ఉండేది నిస్వార్థమైన అమ్మ అనురాగమే

***అమ్మా మనిషికి ఏడు జన్మలు ఉన్నాయంటే నమ్మలేను,***

***కానీ నాకు మరో జన్మంటూ ఉంటే నీవు నాకడుపున పుట్టాలని ఆకాంక్షిస్తున్నా.***

అంటాడు ఓ కవి. అమ్మ మనసు అమృతం. అమ్మ శబ్దానికి అర్థం అమ్మే. మరేది దానికి సాటిరాదు. అంతర్యామి కూడా అమ్మఒడిలోని ఆనందాన్ని ప్రేమను పంచుకోవాలిని మానవ జన్మ ఎత్తాడు. తల్లిప్రేమ లోని మాధుర్యాన్ని గ్రోలడానికి స్వయాన మాధవుడే, కృష్ణపరమాత్మ రూపంలో అవతరించాడు. తల్లిదండ్రులు లేని వానిగా భగవంతుని అభివర్ణించారు. తల్లిప్రేమ ఎంతో శ్రీకృష్ణుని రూపంలో చవిచూసాడు. తల్లి శక్తిస్వరూపిణి, జ్ఞానదాయిని, అమృతవర్షిణి, భగవంతుడు కూడా తల్లి మహోన్న తాన్ని గుర్తించాడు. చరాచర



జగత్తంతా తనలో లయమై ఉన్న స్థితిలో పరమాత్మకి సృష్టిచేయాలన్న సంకల్పం కలిగింది. ఆ సంకల్ప రూపమే ఆదిశక్తి. ఆ పరా శక్తి తన సంకల్పంతో ఈ సృష్టినిర్మాణం చేసింది. దేవుడు అన్నిచోట్లా తానుండేలేక అమ్మను సృష్టించాడంటారు. తల్లికి ఆధిక్యత, పరమోన్నత స్థానాన్ని ఇచ్చి గౌరవించి, పూజించే సమాజం మనది. గోమాత, భూమాత, తల్లి సరస్వతీ అని గౌరవిస్తాము. ప్రతిఫలం ఆశించని అత్యుత్తమ మనిషి అమ్మ. అనురాగానికి ప్రతిరూపం అమ్మ. అమ్మ సృష్టికి మూలం. భూమిపై మనుగడకు తల్లి మాత్రమే అర్హతను కలిగిస్తుంది. నాస్తి మాతృసమం దైవం, నాస్తి మాతృ సమం పూజ్యా, నాస్తి మాతృ సమోబంధు, నాస్తి మాతృ సమో గురుః అన్నారు. ఆకలేసినా, ఆనందం వచ్చినా, దిగులైనా, దుఃఖమొచ్చినా,

*ఇంటిని అందంగా తీర్చిదిద్దే నీవులేని ఇల్లు బోసిపోవును.*
*అమ్మనీఉనికే అందం.*

పిల్లలకైనా, పెద్దలకైనా గుర్తొచ్చే పదం అమ్మ. భక్తుల కోసం భగవంతుడు కేవలం పది రూపాలెత్తాడంటారు. పిల్లల కోసం తల్లి ఎత్తే అవతారాలు అనంతం. బసవ పురాణంలో అమ్మ లేని ఆది దేవుడి దయనీయ స్థితిని బెజ్జమహాదేవి ద్వారా కళ్ళకు కట్టించాడు. మాధవుడైనా మానవరూపం దాల్చాక తల్లికి నమస్కరించాల్సిందే. త్రిమూర్తులను చంటిపాపలుగా మార్చిన అనసూయ కథ లోక విదితమే. అగాధాల అంచులనైనా చూడగలం కానీ, అమ్మ ఆత్మీయానురాగాలకు పరిధులను వెతకలేము. దేవలంతా ఒక వైపు ఉన్నా, తాను అమ్మ వైపే మొగ్గుతానంటాడో ఓ కవి.



అమ్మ ఉన్న ప్రతిబిడ్డ మహారాజే. సమాజం నైతికంగా ఎదగాలంటే అమ్మ తీర్చిదిద్దిన బిడ్డలే కారణం. జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి అన్నారు. కన్నబిడ్డలు ఎదిగి, ఎదిరించినా, కష్టపెట్టినా హృదయంలో కన్నీరు కార్చుతుందే తప్ప కఠినత్వం ఉండదు. వారి క్షేమం కోసమే ఆరాటపడుతుంది. కడుపులో ఉన్నప్పుడు కాళ్ళతో తన్నినా, పాలు తాగే పసితనంలో రొమ్ముపై గుద్దినా పరవశిస్తుంది. ఆమెకు కసి ఉండదు. అదే అమ్మలోని కమ్మదనం, మమకారం, ఆమె మనసు గొప్పతనం.

*నా ఒంట్లోని గాయాల బాధను నీ బాధగా అనుభవించి దుఃఖించేది నీవేనమ్మా.*

కొందరి పిల్లల నిరాపేక్ష, జీవనానికి అలవాటు పడుతున్నారు. సకల తీర్థాలు తల్లియే. తండ్రియే సకల దేవతా స్వరూపుడు. వీరిని సేవించడం సకల తీర్థక్షేత్ర సందర్శనమంతపుణ్యం. తల్లి హృదయమే మానవాళిని నడిపించే అతిపెద్ద విశ్వవిద్యాలయం, క్లుప్తంగా అమ్మను గురించి తెలుసుకోవాలంటే అమ్మ అందించే గోరుముద్దలోని తీపిదనం, పాలు మీగడలకన్నా, పంచామృతాల కన్నా మధురం. కల్మషం లేని పిల్లల ధరహాసాలు  అమ్మ కడుపును నింపే అతి మధుర పాయసాలు. అందం, రంగుల తేడా తెలియని అమ్మ హృదయం కవి కుంచెకీ అందని  ఉహాస్వర్గం. జోలపాట కెందుకో అంతట శ్రావ్యం.ఏడుగురు రాజుల కథలో ఎముందని మహత్యం. ఈ నాటికీ అమ్మ చేతి ముద్ద ఓ వెన్నముద్దే.  మన అభ్యుదయాన్ని ఆజన్మాంతం కోరేది అమ్మే. ఆధునిక సమాజం తన స్వరూపాన్ని మార్చుకున్నా అమ్మ ప్రేమ మాధుర్యాన్ని మార్చుకోలేదు. అలాంటి మాతృమూర్తుల కందరికీ ప్రణమిల్లుదాం.

## మాతృవందనం

శిశువు తొలి సారిగా కనురెప్పలు తెరిచినప్పుడు కనిపిపంచే రూపం అమ్మ. పెదాల వెంట మొదటగా వినిపించే పిలుపు అమ్మ. భూమిపై ఏ జీవికైనా ప్రథమ ప్రత్యక్షదైవం అమ్మ. ప్రతి బాధలో, ఏడ్పులో నోట వచ్చే మాట అమ్మ. తల్లి ప్రేమ అనేది నిష్కల్మషమైనది. నిష్పాక్షికమైనది.  అమ్మ ఔన్నత్యాన్ని, అమ్మలేని పిల్లల దుస్థితిని తెలియజేసే సామెతలు ఎన్నో ఉన్నాయి.

*నేను నీతో ఎంత గొడవ పడినా భోజన సమయాన ప్రశాంతంగా*

*నన్ను దగ్గరకు చేర్చి ముద్దలు తినిపించేది నీవేనమ్మా.*

'తల్లిని నమ్మినవాడు ఉల్లిని నమ్మినవాడు చెడిపోడు'

'తల్లిలేని పిల్లలు అల్లులేని తీగలు'

'తల్లిచస్తే తండ్రి దాయది'

'కన్నతల్లి కరక్కాయతో సమానం'

'కన్నతల్లి నీడ కానుగ నీడ వంటిది'

'ఏనుగంత తండ్రి కంటె ఏకంత తల్లిమేలు'



'జీవన్నాటకంలో అమ్మది అమృతమైన పాత్ర' అన్నారు వేటూరి. ప్రేమలన్నీ కవితలే అయితే! అమ్మ ప్రేమ మాత్రం అమర కవిత' అన్నాడో కవి.

భూమాత బరువు భౌతికం

భూమ్మీది మాత బిడ్డకోసం సహించే బరువు మానసికం.

ఆ భారాన్ని తూచే రాళ్ళు మనిషి ఇంకా తయారు చేయలేదు.

ఎంతరాసినా పూర్తికాని ప్రేమ కావ్యం తల్లి

ఎంత తీర్చినా పూర్తిగా చెల్లిపోని పేగు రుణం అమ్మది.

'భువిని మా అమ్మ కడపున పుట్టుటొకటే! నేను చేసిన పుణ్యము. నేటి వరకు' అన్నాడు ఆచార్య ఆత్రేయ.

పిల్లల బంగారు భవిష్యత్ కు బీజం వేసేది తల్లే.

*నేను తెలియక చేసిన తప్పులను ఇతరులవలె దండించక మంచి మాటలతో సరైన దారి చూపి నేను మారా చేసినా నన్ను మన్నిన్చేది నీవేనమ్మా.*

పిల్లల్లో ఆత్మవిశ్వాసం కలిగించి.... వారిలోని సృజనాత్మక శక్తిని ప్రేరేపించేది మాతృ మూర్తే

పిల్లల చదువులు ఓడకు లంగరులా ఉండి

ఆ ఓడను సరస్వతీ తీరానికి చేర్చటానికి అమ్మ పడేశక్తి వెలకట్టలేనిది.

ఆకలేసినా... ఆనందం వేసినా, దిగులేసినా, దుఃఖం

ముంచుకొచ్చినా, పిల్లలకైనా, పిల్లల కన్న తల్లిదండ్రులకైనా గుర్తొచ్చే పదం అమ్మ.

తన కడుపు మాడ్చుకొని, పిల్లల కడుపు కోసం ఆరాటపడే అమృతమూర్తి అమ్మ.

అమ్మ రూపమ్ము నిచ్చిన అమృమూర్తి
దివినమృతము కలదో లేదో తేల్చజాల
అమృతమను మాటకిల అర్థమమ్మ అనుటె
అమ్మ శబ్ధమ్మునకు సాటి అమ్మ యొకటె.

ఆచార్య గోపీ తల్లిని నిగూఢంగా అర్థం చేసుకొని ఇలా అంటాడు :

ఆమె లేచి సూర్యుడిని లేపుతుంది
అతణ్ణి నిద్రపుచ్చాకే ఆమెకు విశ్రాంతి.

ఎందరో మేధావులు తల్లిని ఈ విధంగా స్తుతించారు.

'ఉపాధ్యాయానీ దుశాచార్య
ఆచార్యాణాం శతాంపితౌ
సహస్రంతు పిత్రూన్ మాతా
గౌరవేణాతిరిత్యతే'

హిమవర్ష తన కవితలో ఎంతో రమ్యతగా అమ్మను కొనియాడుతూ

*అమ్మా నిన్ను తలచినపుడు నాలోని ప్రేమ వరదలా ఉప్పొంగుతుంది.*